# కళ్యాణి రాఘవం

(పద్యగద్య సంకలనం)

రచన

**డా॥ సూద్నగుంట రాఘవేంద్ర ప్రసాద్**

**కళ్యాణిరాఘవం పబ్లికేషన్స్**
1320 N. Cedar Hill Road,
Cedar Hill, Texas 75104

**కళ్యాణి రాఘవం**
(పద్యగద్య సంకలనం)

రచన : **డా॥ సూద్నగుంట రాఘవేంద్ర ప్రసాద్**


ప్రథమ ముద్రణ : మే 2019

ప్రతులు : 1000

వెల : అమూల్యము



ప్రతులకు : డా. సూద్నగుంట రాఘవేంద్రప్రసాద్
ఫోన్ : 78934 12166 INDIA
214-325-1969 USA
ఈ-మెయిల్ : prasadrs27@hotmail.com
వెబ్‌సైట్ : www.nrithinktank.com



ముద్రణ : రైయిన్‌బో ప్రింట్ ప్యాక్
అమీర్‌పేట్, హైదరాబాద్
ఫోన్ : 040-23731620

# ముందుమాట

1985 నుండి ప్రవహించిన కవితాప్రవాహం 1987 లో "కవితాకల్యాణి"గా కిన్నెర పబ్లికేషన్స్ ద్వారా ప్రచురితమైనది. మధ్యలో యీకవితా ప్రవాహం అడపాదడపా దాని ఎరుకను తెల్పుతూనే వున్నది. దాదాపు 20 రచనల తదుపరి, మా 50 వ వివాహ వార్షికోత్సవ శుభ సమయాన ఎందరో ఆప్తబంధుమిత్రులకు మాకానుకగా నా యీ పద్య సంపుటి వెలువడుతుంది.

1985 లో నా హృదయ ఆరాట గీతం "ఏదిమార్గమో ఏదిగమ్యమో తెలిదాయె నేడునాకు" అనిన దానికి సమాధానం, యీ "కళ్యాణీ రాఘవం" లో చదవండి. ఆనాడు నిర్మలమైన మదిలో ప్రవహించిన కవితాకళ్యాణి, క్రమేపి, నా గురువైన భగవాన్ శ్రీసత్యసాయి కృపతో ఆత్మప్రవాహమై 20 రచనల పిదప, మరలా అదే కవిత, దక్షిణామూర్తితత్వంలో నిరంతర మౌన ప్రవాహంమై, దానిపూర్ణతలో అడపాదడపా ఉప్పొంగిన బాహ్య ప్రవాహపు జల్లుల తెంపరులీ "కళ్యాణీ రాఘవం".

ఎందరో బంధుమిత్రుల సహవాస, స్నేహామృతంలో పునీతమై, వారిప్రేమానురాగాలతో తడిసి వికసించిన నాహృదయపుష్పభావ పరిమళమైన యీ "కళ్యాణీ రాఘవం"ను స్వీకరించి, చదివి, ఆనందించి ఆశీర్వదించ మనవి.

మీ
**రాఘవేంద్రుడు**

# విషయ సూచిక

# 1. దేవుడు

దేవుడను మాట పలు భ్రమల మాట:
చాల తికమకలు మదిన కల్గించు మాట
రూపనామాల బంధించునట్టి మాట
పలు ప్రశ్నలకు తావీయునట్టి మాట
మనో పరిమితిన నియమించినట్టి మాట

నిరాకార, నిర్గుణునే నామ రూపంబున పిలుతు
సర్వాం తర్యామై, సర్వం తానైనవాని
ఓ నామరూపమున బంధింప నాకు సాధ్యమగునె

అనంతుడై, సర్వజ్ఞుడై, సర్వ వ్యాప్తుడైనవాని
దేవుడని ఓ నామరూపాన బంధింప నాకు మనసు రాదె.
నా హృదయ వాసియై, తనలోనే నేను, నాలోనే తాను,
తనే నేనుగా, నేనే తానుగా నా తలపంత దగ్గర వానిని
దేవుడని దూరంబు చేయ నా మది యిచ్చగించదాయె

యిచ్చకం బాయెను త్రికాల బాధ్య సత్యనారాయణున్ పిలువ
విశ్వ విజ్ఞానమని, సర్వజ్ఞుడని, సర్వాంతర్యామని, సర్వశక్తిమంతుడని
ఆది మధ్యాంత రహితుడని, అనాధుడని, అనంతుడని, విశ్వంభరుడని,
కాని దేవుడని ఓ నామ రూపాన బంధింప యిచ్చగించదాయె నా మది
నా తలపులో తలపై, చెవుల వినికిడై, నాచర్మ స్పర్శయై, నా కంటి చూపై,
నా నాలుకన రుచై, నా నాసికన వాసనై, నానోట మాటై, నాకాలి బాటై
నా చేత కర్మమైన వాని నే పిలుతు నా అంతరాత్మయని
నేను నేనే నని, నేను నేనే నని, బహు ప్రీతితో నే పిలుతు
నేను నేనే నని.

(ఫిబ్రవరి 9, 2019)

## 2. కళ్యాణీ రాఘవం

అమ్మంటే ప్రాణం రాఘవుని కెల్లప్పుడు
అమ్మ తలపోక మధుర భావాల కెరటం.
పదహారేళ్ల అనుబంధం నాటింది తన హృదయంలో
మరపురాని తీయని మమతానుబంధం
ఓ మధురక్షణాన ఒకే ఒక చూపుతో నచ్చి వచ్చావు
దేవుడిచ్చిన వరంగా నా సహధర్మచారిణిగా నీవు
నా తోడై, నీడై, నా నేస్తమై, ఓరిమితో భరించి
నన్ను నన్నుగా ప్రేమించి, మైమరపించావు
సుగమం చేశావు నా జీవనమార్గాన్ని
వెదజల్లావు నీ హృదయపరిమళాన్ని మన బాటన
నీ సాన్నిహిత్య మాధుర్యంతో నింపి
ఆనందనిలయం చేశావు నా జీవనం.
అమ్మను మించిన అమ్మవై, అమ్మ భవానివై,
నా నిద్రాణశక్తివై జన్మనిచ్చిన అమ్మనే
మరపించావు, మైమరపించావు.
నాల్గు పదులు పైబడిన మన స్నేహం
నీలో కరిగి, నీ మాధుర్యంలో నీలో ఒకటై

ఉనికి లేక నిలిచానిప్పుడు
నీవు లేక నేనిక లేను, లేదు నాకొక ఉనికి నీవు లేక
నీవే నేను, నేనే నీవు, ఒకే తలపు, ఒకే మాట, పాట, బాట.
నీవే నా ఐశ్వర్యం, నా ప్రజ్ఞానం, నా శక్తి, నా యుక్తి.
నీవు లేని రాఘవుడు నిర్వీర్యుడు.
అందుకే నాకు నచ్చిన నా పేరు 'కళ్యాణీరాఘవం'.

## 3. ప్రకృతి అమ్మ మయం

నిరాకార, నిర్గుణ ఈశ్వరునికి
ప్రకృతి ఆకృతి పార్వతమ్మ
అమ్మే ప్రకృతీపురుషుల సాకార దర్శనం
సృష్టిమూలం అమ్మ, సృష్టి రక్షణ అమ్మ

ప్రాణమిచ్చిన గాలమ్మ: ఆ గాలికి మూలమైన తరువులమ్మ
మన దేహ,రైతుక్షేత్ర దాహార్తి తీర్చు గంగమ్మ
మన నడకకు, నిలకడకు ఆధారమైన భూమమ్మ
జన్మ నిచ్చి, చనుపాలతో పోషించిన తల్లమ్మ
రక్తం,రక్షణ, ప్రాణం, పోషణల, జీవమ్మ
ఆహారాన్ని జీర్ణించి, శక్తిని చేకూర్చు వైశ్వానరమ్మ

మనోభావనా చంద్రమ్మ, భావనను మాటగా బయల్పరిచే సరస్వతమ్మ
ఆనందానుభవ రూప, నిత్య సంతోషమ్మ
కోరిన కోరికలు తీర్చు భావభవతి భవానమ్మ
అష్ట సిరులను కురిపించు లక్ష్మమ్మ
లోన ప్రవహించి కలుషిత ప్రక్షాళనాల ప్రసరణమ్మ

మన  వ్యర్థాలతో తాను మలినమై, మన పాప ప్రక్షాళన చేయు గంగమ్మ
మన వినికిడై, చూపై,స్పర్శయై, ఘ్రాణమై, రుచైన సర్వశక్తుల పార్వతమ్మ
అజ్ఞానాన్ని తరిమి విజ్ఞానజ్యోతిని వెలిగించు వెలుగులమ్మ

రకారాగ్నిన జీవన పావన కారకమైన రాములమ్మ
తానుభరించి, పోషించి, తరిగేది అమ్మ : త్యాగానికి మరోపేరే అమ్మ
"త్యాగేనైకే అమృతత్వమానసు"
త్యాగానికి మరోపేరు నీవమ్మ త్యాగాలమ్మ
నీ త్యాగాలతో చిరంజీవిగా నిలచేవు నీవమ్మ భవానమ్మ

(ఆగస్టు 1, 2018)

# 4. నేను నేనే

విశ్వంభరుడవైన నిన్ను ఏ ఆలయంబున నిలుప సాధ్యమౌనె?
నిరాకార, నిర్గుణుడైన సర్వనామములవానిని, ఏ నామమున, నే నిలుపగలను?
గంగనే శిరస్సున భరించిన వానిని, చెంబునీళ్ళతో అభిషేకింప సాధ్యమౌనె?
సకల పదార్ధ సృష్టికర్తయైనవానికి ఏ పదార్ధప్రసాదమున, మెప్పించగలము>
కోటిసూర్యుల వెలుగులవానిని, ఓ ప్రమిద దీపాన చూపగలమె?
అనంత విశ్వాన ఓ నలుసైన నాకు, నీ విశ్వరూపంబు ఊహించ సాధ్యమౌనె?
నీవు కానిది, నీది కానిది నేనేది నీకివ్వగలనె?
నీదికానిదేది, నాదేది లేదు లేదు
నేనన్నదంతయు నీవె, నాదన్నదంతయు నీదె
నీలోనె నేను, నాలోనె నీవు, నేను నీవు, నీవు నేనె,
నేను నేనే, నీవు నేను, నేను నేనే

(అక్టోబర్ 15, 2018)

## 5. ఆధ్యాత్మికం

అంతఃకరణ శుద్ధియే ఆధ్యాత్మికం
అంతర్దర్పణ ప్రతిబింబం, ప్రపంచం
అరిషడ్వర్గ ప్రక్షాళనం, పాత్రశుద్ధి
సానుకూల దృక్పథం, పదార్థశుద్ధి
ఏకాత్మ భావనం, పాకశుద్ధి

ధర్మకర్తృత్వ భావనం, బంధవిమోచనం
తననుతాను తెలియుటే, విశ్వావగాహనం
దేహమనో భావమును వీడుటే, సందేహ నివృత్తి

పరిపూర్ణానుభవమే, కృతజ్ఞత
అహంభావ నిర్మూలనమే, త్యాగం
సర్వం బ్రహ్మానుభవమే, విశ్వరూపదర్శనం

(డిసెంబర్ 4, 2018)

# 6. వేద భూమి

పవిత్రవేద వాఙ్మయాన్ని శృతి పరంపరగా నిలిపి
ప్రపంచానికి వేదాలను కానుకగా యిచ్చిన దేశం.
యిది మన వేదభారతం, మహర్షుల త్యాగభారతం.

జ్ఞానం – విజ్ఞానం – ప్రజ్ఞానం
వెలుగు –ప్రకాశం – తేజస్ లా
ప్రజ్ఞానం బ్రహ్మ అంది వేదం.
అనాది, అపౌరుషేయం, అంతర్వాణి వేదం..
వేదం సుజ్ఞానం, విశ్వవిజ్ఞానం, విశ్వ ప్రజ్ఞానం

మానవ సృజనాత్మకతా దర్పణం వేదం.
స్వశ్ఛ, సరళ, నిర్మల మదిలో పెల్లుబికే
అంతర్వాణి తరంగం విశ్వసత్య దర్శనం వేదం.

అరిషడ్వర్గ ప్రక్షాళనన మొదలై,
నిష్కామ కర్మ చిలుకుడిన, చిత్తశుద్ధిన స్పందనై,
ప్రేమప్రవాహమై, చిత్తవృత్తి నిరోధాన బహిర్గతమై,
అద్వైత దర్శనాన స్వానుభవమై నిలిచునది వేదం.
అడ్డంకులను తొలగిస్తే వినపడేది వేదం.

అడ్డంకులను తొలగిస్తే, స్వానుభవమయేది వేదం.
అరిషడ్వర్గ ప్రక్షాళనానంతరం, జన్మజన్మల కార్మిక శేష భస్మానంతరం
సకల భవబంధ విషయ విష ప్రక్షాళన తదుపరి మిగిలేది
నిర్మలం, నిశ్చలం, నిరాకారం, త్రిగుణాతీతం,
అనంతం, గగనసదృశం, సాక్షీభూతం, అంతరంగ జనితం వేదం.
ప్రణవాకారం, ఓంకారం, విశ్వమూలం

సత్య స్పందన సత్య భావనాప్రవాహమై, ప్రేమై
ప్రవాహప్రేమే జీవమై, దేహమైకదలికై నిలచినది.
స్వశ్చతన ప్రణవం ధ్యానమై, శాంతి, అహింసలై
ప్రేమేగంగాప్రవాహమై– జీవమై, భక్తిసారమై
ఘనమై, దేహమై, ధర్మమై, కర్మమైనది.

అష్టాదశపురాణాలసారపు,
సహాయపడు –నొప్పించకు–
ప్రేమించు – సేవించమని,
ఆరింటిని త్యజించి– ఆరిటినిగ్రహించు
కామ,క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య త్యజితం
సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస, త్యాగగ్రహితం

చెడునుత్రుంచి–మంచినిపెంచమని
సానుకూలత, మంచితనం, మృదుత్వం,
సరళత, స్వశ్చత, నిర్మలాన

స్వస్వరూప దర్శనానుభవ
విశ్వరూపదర్శన భారతం
విశ్వ ఆధ్యాత్మికాలయం
ప్రసిద్ధ పుణ్య భారతం నా వేద భారతం...

# 7. నా భారతం

భావ, రాగ, తాళ మయం భారత్.
'వసుధైక కుటుంబం' భావమై,
'లోకాసమస్థా సుఖినోభవంతు' రాగమై,
ప్రణవమే తాళమైన మన భారత్.
'భా' అనగా సత్యం, 'రత్' అనగా ప్రేమికులు అనీ,
అలా 'సత్యప్రేమికుల నెలవు భారత్' అనీ
దుష్యంత, శకుంతల పుత్ర, భరతుని
మూలపురుషునిగా వెలసినదికాన భారత్ అనీ,
రాజ్యత్యాగంతో, రామపాదుకా ధ్యానంతో
రామధ్యానభరతుని రామరాజ్యం భారత్ అనీ
వేద విజ్ఞానఖని, సరస్వతీ నిలయమైనది కావున
విభిన్న అర్థాల, విభిన్నపు ఏకత్వం భారత్
సుదీర తీరాల వెలుగుల దీపం,చుట్టూవున్న చీకటిలా,
దైవంచుట్టూ మాయలా, దగ్గరలో మరుగయి
దూరంలో ప్రకాశించు భారత అంతరంగ శోభ.

దరి దర్శనం దేహం, సుదూర దర్శనం భారతీయ హృదయం
అనంత తేజోమయ ఆత్మసౌందర్య భారతం

యిది వేదభూమి, కర్మభూమి, యోగభూమి, అవతారభూమి, దైవభూమి, విష్ణు పాదాన పుట్టి, భగీరథ దీక్షతో, శివజటాజూటాన భువికిదిగి, పాతాళానికి ప్రవేశించు త్రిలోక పావని గంగామాత ప్రవహించు పుణ్యభూమి.
యిది ప్రపంచ ఆధ్యాత్మిక శిక్షణాకేంద్రం, విశేష చికిత్సా కేంద్రం.
యిది కర్మ భూమి, తపో భూమి, ఋషి భూమి.
గోడలులేని సువిశాల ఋషివిశ్వవిద్యాలయాల కేంద్రం నాభారతం.

క్రీస్తుశకపు తొలి శతాబ్దిన ప్రపంచాన మూడవ వంతైన
అపార సంపదల నిలయం నా భారతం

యీ సంపదకొరకే కొలంబస్ లాంటివాళ్లు, తురుష్కులు, పాశ్చాత్యులు పోటీలుపడి భారతావనిపై దండెత్తి, మనఅనైక్యతా, అంతః కలహాలకల్మషాల మనలను ఓడించి, మన సంపదను కొల్లగొట్టిన చరిత్ర భారతం నా భారతం..

పొగడెదరు భారతంప్రపంచ విజ్ఞానఖనని.
యిది ఆధ్యాత్మిక డిస్నీలాండని,
గ్లోబల్ ఆధ్యాత్మిక విశ్వవిద్యాలయమని
ప్రపంచ మన్ననలు పొందిన నా భారతం..

నలందా విశ్వవిద్యాలయ చైనా విద్యార్ధి హ్యూయన్సాంగ్
తాను చేసిన భారతీయ విజ్ఞానభాండాగార, చైనా భాషానువాదం
చైనా 80 శాతం బౌద్ధం కారణం.

మన భారతీయ తత్వ విజ్ఞానం, పర్షియా, టర్కీలద్వారా లాటిన్, ఆంగ్లంలోకి,మెకాలేలాంటి జర్మనులు జర్మనీలోకి తర్జుమాలై ప్రపంచ ఆధ్యాత్మికరంగానికి దశా, దిశలై వెలుగుతున్నవి. ప్రపంచ ప్రఖ్యాత తత్వవేతల మన్ననలు పొందిన విజ్ఞాన దేశం నా భారతం. ఫిట్సెస్ కాప్ర, ఐన్ స్టీన్ లాంటి ఫిజిసిస్టులను అబ్బురపరచిన ప్రజ్ఞనాభారతదేశం. నాదేశం, భారత దేశం.

డిసెంబర్ 7, 2018

# 8. అక్షర కృతజ్ఞతాంజలి

(గురుతుల్యులు బ్రహ్మశ్రీ సామవేద షణ్ముఖ శర్మ గారికి)

వీనుల విందు మది పసందు
నిగూఢ వేదార్థముల వెలికితీసి
ప్రత్యక్ష దర్శనము కావించెడు
మీ ప్రతిభసాధ్యమే తదితరులకు !
తత్వదర్శన, సామవేదులకుకాక వేరొకరికి !

ఈ రీతిగ ధారణగ కనులకు కనుపించునటుల
దర్శింపచేయు మీ ప్రతిభ అద్వితీయం
ప్రత్యక్షానుభవమున మాత్రమే సాధ్యం
అనెదరు సామవేది అని మిమ్ముల
అది మీ వంశ నామమో మరి బిరుదో తెలియదు నాకు

భళిరా ఎంత సబబు మీకు,
ఆ నామమునకే వెలుగు మీరలు
తగును మీకది అక్షరముల విప్రోత్తమా! గురువర్యా!

లలితాంబికా దర్శనము కావించితిరి అందరికి !
అందరిలోనున్న అదృశ్య నిగూఢ శక్తిస్వరూపిణి
అను అంతరార్ధమును వెలికి తెచ్చిన సామ వేద్యుడా !
యిది సాధ్యమా అన్యులకు తత్వదర్శనులకు కాక !

దేవతలు రాక్షసులు వేరు వేరు కాదు
మన అంతరంగమున నున్న
అనుకూల, ప్రతికూల భావములె అని
ఎంత చక్కగ చెప్పితివీవు

ఈ దేవదానవ రణక్షేత్రం మన అంతరంగం అని
మనలోని దానవత్వాన్ని దైవీ శక్తులతో గెలిచి
దానవత్వాన్ని నిర్మూలించి, మానవత్వాన్ని వుద్ధరించి
సాధనతో అంతర్గతదైవత్వాన్ని చేరమని చెప్పితిరి
ఎంత సబబో యీ అంతరార్ధము

పామరులకు వేదార్ధము తెలియుటకు
మిత్ర సమ్మిత పురాణములు "కేస్ హిస్టరీస్ ఆఫ్ వేదాస్"
అని వేద గూఢార్ధమును వెలికి తీసెడు
సులభ గ్రాహ్యమగు కథల సంపుటములని
పురాణములకే కొంగొత్త వెలుగుతెచ్చితిరి మీరు

ఏ ఏ భావమున తలతురో
ఆ ఆ రూపమున నే దర్శనమిత్తును
అని చెప్పెను భగవానుడు గీతలో
అదేవిధిన చెప్పితిరి పలు దృక్పథములు
భక్తులకు, పురాణ పాఠకులకు

ఏఏ భావమున చదివెదరో,
ఆ ఆ రూపదర్శనమె అగునని
భగవానుడు మనముందు ఒక దర్పణమని
మన స్వభావమే మన దర్శనమనిరి

లౌకిక దృష్టిన చూసినను మేలని చదివిన
యిది మంచి వ్యక్తిత్వ వికాస నిఘంటువని,
భారతం ప్రపంచానికొక కానుకని
భళిరా చూచితిమి మీ ఆత్మమధనం,
సనాతన ధర్మ రక్షణకై, ప్రతి సాధకుడు
ఓ సైనికుడు కావలెననిన మీ ప్రభోధం

చూచితిమి అప్పుడు మీలో ఒక నరేంద్రుని మరల
ధర్మ రక్షకా, యిదే మా బాస
నడిచెదము అడుగున అడుగేసి మీతో మేము
ఒక సాముహిక శక్తిగా ,భరత మాత కన్నీరు తుడిచి
ఋణము తీర్చగ మేము, అమోఘము మీ పరివర్తనా సందేశామృతం

(జూన్ 28, 2015)

# 9. నీరు–గంగామతల్లి–భాగీరథి

నీరే ప్రాణం– నీరే ప్రవాహం – ప్రవాహమే ప్రాణం – నీరే ప్రాణం.
నీరే జీవితం –నీరే జీవనం – జీవనమే జీవితం – నీరే జీవితం.
నీరే జీవిత జీవనాధారం – జీవనాధారమే జీవితం – నీరే జీవిత జీవనాధారం

నీరుంటే నాగరికత – లేకుంటే ఆటవికత– నీరే నాగరికతకు మూలం
నీరుంటే ఊరు – లేకుంటే స్మశానం
నీరే ప్రాణుల దాహార్తిని తీర్చే గంగామ తల్లి
నీరే భూమాత దాహార్చిని తీర్చే గంగామ తల్లి
నీరే కర్షక శ్రమ ఫల దాత –కృషీవలుని మాత

నీరు ప్రాణుల దాహార్తిని తీర్చి, జీవుల అంతర్బహిశ్శుద్ధి గావించి,
మన పరిసరాలను, నగరాల మురికిని ప్రక్షాళించి,
తను మలినమై, మనకు అమృతాన్నిచ్చే త్యాగమూర్తి,
మన పవిత్ర గంగామ తల్లి..

విశ్వంలో ప్రాణాధారం నీరు.
భువిన మూడొంతులు నీరు.

దేహాన మూడొంతులు నీరు
కణ కణాన మూడొంతులు నీరు.

నీరు రక్తమై, రసమై ప్రవాహమై
దేహ పోషణ, సంరక్షణ,సమైక్యతా పరిరక్షణా కారకమై
ఆరోగ్య పరిరక్షణా నిలయం నీరు.

త్రిరూపధరం జలం – ఘన, ద్రవ, వాయు రూపధరం
ద్రవంగా పల్లానికి భువిపై ప్రవహించేది జలం
ఘనంగా నీటిపై కదిలి, తేలేది హిమం
ఆవిరిగా, నలు దిశలకూ వ్యాపించేది మేఘం.

నీటి ధర్మం ప్రవాహం, ప్రాణుల మనుగడే దీని ధర్మం
పోషణ, సంరక్షణ, సమైక్యత, ప్రక్షాళన, పరిరక్షణలు
యీ ప్రవాహ కర్మ ధర్మం.

ప్రవహించే నీరు పవిత్ర గంగామతల్లి.
సత్య (భావ) ప్రవాహం ప్రేమ
ప్రవహించే ప్రేమే దైవప్రేమ,
ఇదే పవిత్ర అంతర గంగామాత

విష్ణుపాదాన (నిరాకారాన) పుట్టి,
ఈశ్వర (అద్వైత) సహస్రారాన చేరి,
భువినుండి పాతాళానికి ప్రవహించే
పాప ప్రక్షాళన, లోకసంరక్షణా
త్రిలోకపావని గంగామ తల్లి.

నా (సత్య) భావస్పందనలో (ఓంకారాన) జన్మించి,
అద్వైత ఏకాత్మభావనా సహస్రారాన (ప్రేమ) ద్రవించి,
భువిన ప్రవహించి, భరించి, రక్షించి (సేవ),
పాతాళానికి చేరే త్రిలోక పావని (త్రికరణ శుద్ధి)
నామాత గంగామతల్లి, నా గంగామాత. భాగీరధి,
యిదే రాఘవేంద్రుని హృదయ సవినయ ప్రణమాంజలి.

డిసెంబర్ 1, 2017

# 10. అమ్మకు ప్రణామం

అమ్మ అనే పదం ఎంతో చల్లదనం
ఆ పిలుపులో ఎంతో తీయని కమ్మదనం.

త్యాగం, ప్రేమల కలబోతే అమ్మ
భువిలో ఎదుటే నిలచే ప్రత్యక్ష దైవమే అమ్మ

ప్రేమే దైవ స్వరూపమనిరి విజ్ఞులు
త్యాగమే అమృతత్వానికి మార్గమనెను శాస్త్రం

భువిలో త్యాగ, ప్రేమల కలబోతే అమ్మ
అమ్మే ప్రత్యక్ష దైవం, నిత్యం ఎదుటుండే దైవం

'మాతృదేవోభవ' అన్నది వేదం
పుడమిన అందరి అమ్మలకూ ప్రణామం
అని అంటున్నాడీ కళ్యాణీ రాఘవం

(మే 8, 2016)

# 11. ప్రవాస భారతీయుడా!

ప్రవాస భారతీయుడా
స్వశ్ఛ హృదయ ధీరుడా
దేశానికి నువు కడు దూరమైనను
తన హృదయానికి అతిచేరువరా

భరతమాత సౌఖ్యమె నీ ధ్యాసరా
తన సంతోషమె నీకు ప్రీతిరా
అమ్మంటే నీకు ప్రాణమురా
అమ్మకు నీవంటే ప్రియమురా

అనన్య మాతృ చింతనయె ఒక యోగం
ఆ యోగమె నీ తపస్సురా
భారతానికది ఆశీస్సురా
భారత జాతికే అది శ్రేయస్ అవునురా

ప్రవాస భావనయె ఒక ప్రణవమై
ప్రవాస పలుకులె మంత్రాలై
ప్రవాస జీవనమొక యజ్ఞమై

ప్రవాస కార్యమె ఒక ధర్మమై
ప్రవాస జీవన హృదయ యోగమై
భరత హృదయారామమైన
నీ జీవితమె ఒక తపస్సురా!

(మార్చి 26, 2016)

# 12. వర్ణం, కులం వేరు వేరు

‘చాతుర్వర్ణం మయాసృష్టం’ అని గీతలొ శ్రీకృష్ణుడనిన
శాస్త్ర సమ్మతి కులాలకుందని గుడ్డివాదన సలపకోయి
‘గుణకర్మ విభాగనా’ అని ముగించెను భగవానుడు
కులం వర్ణం ఒకటి కాదోయ్ – ఒకటే అనుకున్న అది భ్రమ

సంచార వృత్తి జాతులు, తదితర జాతులతో స్థిరమై కులమైనది
గ్రామ స్వయం సమృద్ధికి సోపానమైనదీ కులం ఆనాడు
వంశపారంపర్యంగా వృత్తిన వచ్చిన ఆచారమే యీకులం
కాలానుగుణంగా మారేది, మారవలసినదీ కులం,
కాలానుగుణంగా మారేది, మారవలసినదీ కులాచారం

పూర్వజన్మ కర్మల శేషసారం గుణం
యీ జన్మలోన చేయు పనులె కర్మము
గుణకర్మములతోనే యీ వర్ణము
బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని చాతుర్వర్ణములు

బ్రాహ్మణత్వం కులజన్మతో రాదోయ్
సత్వగుణాధికం బ్రాహ్మణ
రజోగుణాధికం క్షత్రియ
సత్వ, రజో,తమో, గుణ మిశ్రమం వైశ్య
తమోగుణాధికం శూద్ర

జన్మనందరు అవుదురు శూద్రులు
మంచి నడతతో ద్విజులు అవుదురు
వేదజ్ఞానేన విప్రులు
బ్రహ్మజ్ఞానానుభవాన బ్రాహ్మణులు

జన్మచక్రం కాదిది – పరిణామచక్రం మానవునికీ
వారసత్వం కాదిది – ఉద్ధరత్వం ప్రతిజీవికి
జన్మరీతి యెవరికెరుక – చేయు కర్మము విస్పష్టము

జన్మద్వారా అందరొకటే
గుణకర్మ ద్వారా ఈ విభజన
మును జన్మ సంస్కారమున కన్నా
యీ జన్మలోని శ్రమలు మిన్న

ఎటుల పుట్టావనుటకాదు
ఎలా నడచేవనుట ముఖ్యం
ఎటుల ఎదిగేవనుట శ్రేష్టం
ఎలా వెళ్లేవనుట ముఖ్యం

అనాది, శుద్ధం, స్వచ్ఛం,
నిత్యానందం, పరమసుఖం, ఆత్మం
శూద్ర, బ్రాహ్మణ లేదు ఆత్మకి
అందరిలోని ఆత్మ ఒక్కటే

కాలానుగుణంగా మారేది, మారవలసినది ఈ కులం,
కాలానుగుణంగా మారేది, మారవలసినద ఈ కులాచారం

(జూన్ 4, 2015)

# 13. పరివర్తనా కవిత

భావ, రాగ, తాళం గీతం, సంగీతం, భారతం
దైవం భావప్రియుడు, బాహ్యప్రియుడు కాదెన్నడు
భావసౌందర్యమె, హృదయసౌందర్యం,
స్వచ్ఛతే దీని మూలం
పూవులోని పరిమళం భావం
భావ శూన్యగంభీర కవిత సువాసనలేని పూవు
హృదయ నైర్మల్య జనితం సద్భావన
'బాలరసాలసాల నవ పల్లవ కోమల' పోతన కావ్య
కన్నియ 'పద పదమంచు కింకరుల్ పాశము లాగెడి వేళ'
అనెడి సాయి పదము
యీ భావనే నవనీత పాకం – నైర్మల్య హృదయపాకం
విశదీకరించునొక కవిత, విశ్లేషించు మరొకటి
ఉత్తేజ పరచు నొకటి, పరివర్తనా కవిత వేరొకటి
కవితారాజం అతి శ్రేయం పరివర్తనా కవిత

(మార్చి 15, 2015)

# 14. స్వామిపాద స్పర్శానుభూతి

జుంటి తేనియలకన్న బహుతీపి నా స్వామిపలుకు
బంగారూ, అనే పిలుపులోనే ఉంది వేయితల్లుల మమత
కడచూపుతోనె మందలించు కన్నతండ్రిలా
మౌనంలోనె విశ్వ జ్ఞానాన్ని బోధించు విశ్వగురువు
నా స్వామి దర్శనం పాపనాశనం
స్పర్శనం బంధ విమోచనం
సంభాషణం మోక్షకరం

మరువలేనిదా స్పర్శానుభూతి
వర్ణాతీతం ప్రశాంతిశాంతి
తనివి తీరనిది స్వామి ప్రేమానురక్తి

సర్వం నీవే స్వామీ, నా సర్వం నీవే స్వామీ
నాదన్నదంతా నీదే స్వామీ
నే కోరేది నీప్రేమనే స్వామీ
నీవే నా ప్రాణం, నీవే నా సర్వం స్వామీ

(మార్చి 3, 2015)

# 15. అమ్మానాన్నలు

చల్లని గాలులు వీచే పచ్చని వృక్షాల సొంపు
ఎగుడు, దిగుడు సొంపుల కొండల లోయల ఒంపు
జలజల గలగలల జలాల, పక్షుల కిలకిలల శబ్దాల ఇంపు

ఒంపులు, సొంపులు, ఇంపుల నిలయపు హరివిల్లు కదా ప్రకృతి
ప్రకృతి మూలం పురుషుడు
సృష్టికి ఆధారం పురుషుడు
పురుషునిలో సగభాగం ప్రకృతి

ఈ ప్రకృతి ఆకారమె అమ్మ
అమ్మకు ఆధారమె నాన్న
జీవన రమ్యపు అందాల సౌధం అమ్మ
సౌధపు అదృశ్య పునాదే నాన్న
మమతల, లాలనల, గోరు ముద్దల అమ్మను మరువ మెపుడు
ఆ ముద్దల వెనుకుండిన అజ్ఞాత శ్రమల మరుగున నాన్న
ప్రేమ, మమతల అమ్మే మన హృదయపు ఆలాపన
కనపడని అదృశ్యపు అజ్ఞాత ఆధారమె మరుపైన నాన్న

సక్రమ నడతకు ఆధారం క్రమశిక్షణ
అది లేని జీవితం వక్రమార్గాల కంపు
సక్రమ జీవన గమ్యపు ఆధారం నాన్న
అమ్మానాన్నలిరువురు రెండు కన్నులు మనకు

కుడి కన్ను నాన్నయితే, ఎడమ కన్ను అమ్మ
తీక్షణ వెలుగుల ప్రచండ భానుడు నాన్న
హృదయ రమ్యపు చంద్రుని చల్లని ఆహ్లాదపు వెన్నెల అమ్మ
అర్ధనారీశ్వరతత్వం ప్రకృతి, అర్ధనారీశ్వరులె అమ్మానాన్నలు

విడదీయలేనిదాబంధం, అమ్మానాన్నల అనుబంధం
ఇదే మనకు మార్గదర్శకం, యిదే మనకు మూలం
అమ్మానాన్నలె మనకు మూలం,
అమ్మానాన్నలె మనకు ఆదర్శం

(నాన్నల పండుగ దినం : జూన్, 21, 2015)

# 16. ఏది మార్గం? ఏది గమ్యం?

ఏది మార్గమొ ఏది గమ్యమొ—తెలియదాయె ఆనాడు నాకని
అపుడు సతమతమైన మనసుకు – ఏమిటో మరి దీనిజవాబని
విలపించితినానాడు

నేనే మార్గము, నేనే గమ్యమని—పలికితివి జవాబుగా ఒకనాడు
ఆ నేను పర్తిసాయిగ ఎద నిలిపి – మురిసి కొలిచితిని ఆనాడు

యీ పర్తినేను మారె కాలక్రమాన—పరిణితి చెందెనీ పర్తిసాయి నేను
విశ్వసాయి, సర్వాంతర సాయిగపుడు

ఇదే స్థిరమని నమ్మిన కొన్నాళ్ళకు
మరలమారెనువిశ్వసాయి ఓనాడు నేను నేనేనని,
నా హృదయసాయే అనేనని
అందరి హృదయసాయే నాలోని నేనని
నేను నేనే ననిన దృఢమైన తీర్పు నేను నేనే

తత్వమసి, ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మోస్మి–
సర్వం బ్రహ్మం. సర్వం బ్రహ్మమయం సర్వం
నేను నేనే ఇదే మార్గం, ఇదే గమ్యం, ఇదే జవాబు
ఏది మార్గమొ, మరి ఏది గమ్యమొ తెలిసెను నేడు నాకు.

(మార్చి 3, 2015)

# 17. ప్రేమ

సృష్టి భావన ప్రేమ—సృష్టి ప్రేరణ ప్రేమ ★ సృష్టి ఆది ప్రేమ—సృష్టి అంతం ప్రేమ
సృష్టి గమ్యం ప్రేమ—సృష్టి ధర్మం ప్రేమ ★ సృష్టి కారణం ప్రేమ—సృష్టి కార్యం ప్రేమ
సృష్టి దేహం ప్రేమ – సృష్టి హృదయం ప్రేమ

చరాచర సృష్టి సంబంధభాంధవ్య బంధం ప్రేమ ★విశ్వకాల గమన సామరస్యం ప్రేమ
సత్యధర్మ శాంతి తరంగం ప్రేమ ★ దైవానికి వారధి ప్రేమ – దైవతత్వం ప్రేమ

మాతృమూర్తి హృదయానురాగం ప్రేమ ★ ఆప్తమిత్రుని గాఢ మైత్రి ప్రేమ
అన్యోన్య దంపతుల పరస్పర త్యాగజీవనం ప్రేమ ★ సద్గురు శిష్య అనుబంధం ప్రేమ
తేనెలోని మధురిమలాంటిది ప్రేమ ★ పిల్లగాలుల చల్లదనం లాంటిది ప్రేమ

దాహార్తి తీర్చే నీరు లాంటిది ప్రేమ ★ ఆకలి కడుపున తొలిముద్ద లాంటిది ప్రేమ
ప్రేమికుల తొలిముద్దు మైకం లాంటిది ప్రేమ

మమత్వపు చెరనుండి మమధర్మపు స్వేశ్చకు నిచ్చెన ప్రేమ
అనేకత్వ సంసారసాగరం నుండి ఏకత్వ తీరం చేర్చు నావ ప్రేమ
అణువణువున దాగిన ఏకత్వ సూత్రం ప్రేమ ★ బాద్యతలు లేని ప్రేమయే అమరప్రేమ
అన్నిప్రేమల కన్న మిన్ననా సాయి ప్రేమ ★ సర్వ జీవ హృదయ స్పందనే యీా దైవ ప్రేమ

ప్రేమే జీవం, ప్రేమే దైవం ★ ప్రేముంటే శివం, లేకుంటే శవం
ప్రేమలేని జీవనం జీవశ్చవం, నిరర్ధకం
ప్రేమ నిండిన జీవనం భువిలోని స్వర్గం, ఆనందమయం.

(ఫిబ్రవరి 28, 2015)

# 18. నాలోని నేను

దొరికి చిక్కనివాడు – వదలిన దొరకువాడు
శూన్యంలో నిండువాడు – ఎరుగకనే సర్వమెరిగినవాడు
లేకనే సర్వమున్నవాడు – చేయకనే అన్నీ చేయువాడు
చూడకనే చూచేవాడు – వినకనే వినేవాడు

మౌనంలోనే తెలిపేవాడు – మరపు ఎరుకల రాజు
తనవారు లేక అందరివాడైన వాడు
అనాధుడై జగన్నాధుడైనవాడు
అతిసూక్ష్మమై – బ్రహ్మాండమంతెత్తువాడు
నామ రూపములు లేకనే – సర్వరూపనామాలయినవాడు

తెలుసన్న వాడికి తెలియక – తెలియదనిన వాడికే తెలిసేవాడు
పాండిత్యానికి తెలియక – స్వచ్ఛత, త్యాగ, వినయాలకు తెలియువాడు
భాషా, బాహ్యాలకు దూరుడై – భావ, ప్రేమలకు లొంగువాడు
సన్నిహితుడై అతిదూరుడైనవాడు – సులభుడై దుర్లభుడైనవాడు

ఏక అనేకమయి – సర్వం తానైనవాడు
ఎరుకతానై, మరపుతానై – మరపు నుండి ఎరుకకు మళ్లించువాడు
భ్రమ తానై, బ్రహ్మం తానై– చావుబ్రతుకుల నడుమ పరిభ్రమణ చేయించువాడు
జీవంతానై, జీవితానై—జీవన ద్వంద్వాల నటన నడుపువాడు

నాలోని నేనుగా, జీవంగా, ప్రాణం, ఎరుకగా నున్నవాడే
అందరిలోని నేనుగా, సర్వభూతాత్మగా, సర్వభూతాంతరాత్మయి
ప్రజ్ఞానం బ్రహ్మ: తత్వమసి: అహంబ్రహ్మోస్మి – సర్వం బ్రహ్మంఅయి
తానే సర్వమయి, సర్వం తానే అయి అంతట నిండినవాడే– నాలోని నేను.

(ఫిబ్రవరి 20, 2015)

# 19. ఆత్మరూపం – కృతజ్ఞతాభావం

అహందేహం, నేను–నాది! – అహంకారం దీని రూపం!
మరపు, మనుగడ దీనిచలనం! – సేవలొందుట దీని నైజం!
ఆటుపోటుల జీవన సమరం! – క్షణం సుఖం, అనంతం కష్టం!
ఊగిసలాడే బ్రతుకు పయనం!

ఇక్కట్లకందరు సదాకారణం! – తన ఎదుగుకు మాత్రం తనే కారణం!
తనే ప్రపంచం, తనకొరకే జగత్ – తనకోసమె తన కొరకే అందరూ
స్వార్ధ భావనమే జీవనం! – తానే అందరికి కొలమానం!
పరాన్నభుక్తం! అజ్ఞానాంధకారం! – అహంకారమయజీవనం!

కృతజ్ఞతాభావం – నిండుదనానికి మరోరూపం!
పరిపూర్ణతే దీనిమూలం! – స్వశ్చత, వినయం, పూర్ణత
ఏకత్వం, ఐక్యతలో పయనం! – దివ్యత్వమే గమ్యం!

లక్ష్యం ఆత్మిక గమ్యం! – గృహమౌను స్వర్గధామం!
అజాత శత్రువై – అందరి బంధువై
జీవన పయనమే ఓ తీర్థయాత్రగా – ప్రపంచమే ఒక పుణ్యక్షేత్రంగా!
చేరును ఆత్మ ధామం! – సర్వసంకట బంధ విమోచనం!

కృతజ్ఞతాభావనే తొలి అడుగై – పొందును
అనంతానందానుభవం!
మరపులో అహంకారం! – ఎరుకలో ఆత్మానందం!
ఆత్మకు మారు రూపం! – కృతజ్ఞతాభావం!

ఆగస్టు25, 2014

# 20. జనగణమన

ప్రజల మనోభావ అధినాయకీ, ఓ విశ్వాత్మ స్వరూపిణీ
నా భారతావని భాగ్య విధాత్రీ

పంజాబు, సింధూ (ఉత్తరాన), గుజరాత్, మరాఠా (పశ్చిమాన),
ద్రావిడ (దక్షిణాన), ఒడిస్సా, బెంగాల్ (తూర్పున)సరిహద్దులుగా
నలుదిశలా వ్యాపించిన పవిత్రావని నీ దేహం

వింధ్య హిమాచలాలమీద ప్రతిధ్వనించే వాయుతరంగాలె నీవాక్కు
పవిత్ర యమునాగంగల (ఇడ, పింగళల) ప్రవాహమే నీశ్వాస
హిందూమహాసాగరంలో ఎగసిపడే ఎడతెగని కెరటాలు
నీ కీర్తిని అహర్నిశలూ శ్లాఘిస్తున్నాయ్
నీ శుభనామాన్ని జపిస్తూ, నీ ఆశీర్వాదాన్ని కోరుకుంటూ
నీ విజయగాధలను నిరంతరం పాడుకొంటున్నాం.

దేశ ప్రజలను అనునిత్యం చల్లగా చూసే తల్లీ, నీకు శుభమౌ గాక!
భారతదేశ భాగ్యవిధాతా, నీకు మంగళమౌ గాక!

ఓ తల్లీ, నీకు జయమగుగాక, జయమగు గాక!
జయం, జయం, జయం, దిగ్విజయమగు గాక! జైహింద్

(ఆగస్టు 15, 2014)

# 21. భగవద్గీతా స్తోత్రం

గీతామాతా! నమోస్తుతే! నమోస్తుతే! ప్రణమోస్తుతే!
మమత్వజనిత శోకం నుండి, మమధర్మాన్ని ఉద్బోధించి
గమ్యానికి నడిపించే అంతర్వాణి గీత!
విషాదాన్నుంచి విముక్తిని కల్గించి, అనందాన్ని నింపే దివ్యఔషదం గీత!
ఇంద్రియాల నుండి మనస్సుకు, మనస్సు నుండి బుద్ధికి, బుద్ధి నుండి ఆత్మకు,
దేహం నుండి దేహికి, తీసుకెళ్లే జీవ ప్రవహం గీత!

దైవం—ప్రకృతి వేరనే భావన నుండి, ప్రకృతిలో దైవం,
దైవంలో ప్రకృతి, ప్రకృతే దైవం, దైవం ప్రకృతి ఒకటనే వరకూ!
అద్వేష్టాసర్వభూతానాం నుండి సర్వం విష్ణు మయం జగత్ కూ
అహం బ్రహ్మోస్మి నుండి సర్వం బ్రహ్మం వరకూ!
అసుర సంపద నుండి సుర సంపదకూ!
దానవత్వం నుండి, మానవత్వానికి, తదుపరి దైవత్వానికే నిచ్చెనే గీత!

మరపునుడి ఎరుకకు, అజ్ఞానం నుండి సుజ్ఞానానికి, సుజ్ఞానం నుండి విజ్ఞానానికి,

విజ్ఞానాన్నుండి దివ్యానుభవంతో ఏకాత్మ దివ్యదర్శన ప్రజ్ఞానమోక్ష ప్రదాయిని గీత.
భవబంధమనే సంకెళ్ళ నుండి విముక్తి కల్గించి, ఆత్మానంద స్వేశ్చను ప్రసాదించే మహామంత్రం గీత!

ప్రజలే దైవంగా, దేశమే దేహంగా, సేవే భక్తిగా, ధర్మమే మార్గంగా, సత్యమే గమ్యంగా,
ప్రేమే ప్రాణంగా, త్యాగమే ప్రసాదంగా మార్చి, అనుభవింపచేసేదే గీత!

భవరోగహారిణి, అజ్ఞాననిర్మూలిని, సర్వసందేహనివారిణి, మమత్వ బంధఛేదిని, స్వేశ్చాప్రదాయిని, సర్వఫలదాయిని, విజ్ఞానప్రదాయిని, సమస్తసుఖదాయిని, ఆనందప్రదాయిని, గీతామాతానమోస్తుతే, నమోస్తుతే, ప్రణమోస్తుతే!

ఆగస్టు 13, 2014

# 22. మాయ

లేక ఉండేది ఇహం – ఉండి లేదనిపించేది పరం
ఇహపరాల నడుమ సంసారం – ఎరుక మరపుల మధ్య ఈ జీవనం
ఇహపరాల నడుమ జీవనతెర–మల, విక్షేప, ఆవరణాల పొర

జీవనభ్రాంతికి సోపానం – మూడు పొరల మరపు మాయల తెర
తెర వెనుక సత్యం – తెర ముందు విశ్వం
తెర మరుగున ఏకం – యీవలనేకం
ఏకం అదృశ్య మూలం – అనేకం సదృశ్య, విశ్వం
ఇదే సృష్టి మర్మం.

కర్మ జన్మల మాలిన్యం మలం
చంచల మనస్ విక్షేపం
చీకటి విద్య ఆవరణం

నిష్కామకర్మఫలం, మలనిర్మూలనం, నిర్మలం
మనోలయం విక్షేప రహితం, స్థిరం
అవిద్యాహారం, ఆవరణాలయం, జ్ఞానం
సమగ్రయోగం స్వస్వరూప దర్శనం
మాయా మటు మాయం

(మార్చి 1, 2015)

# 23. ఎరుక మరపుల జీవితం

మాలిన్యాన మరపు గలుగు, విక్షేపాన భ్రమలు ఎదుగు
ఆవరణాన తెరలు నిండు. మాయామయ జీవనం
ఎరుకన, వినికిడై, కనపడేది, ఒకప్పుడు లేక ఇప్పుడున్నది కాదు
మాయపొరల మరుగున దాగిన, నిత్యమున్న సత్యమయం పరం

లేక ఉందనిపించు యిహం, ఉండి లేదనుపించు పరం
మరపులో ఎదిగేది ఇహం, ఎరుకలో తరిగేది ఇహం
మరపు, ఎరుకల నడుమ మనిషి జీవితం
ఒడుదుడుకుల లక్షణం, ఆటుపోటుల జీవనం
సమభావన భూతల స్వర్గం, అసమభావం ప్రత్యక్షనరకం

దైవమెక్కడ అను ప్రశ్నన మొదలిడు జీవన యాన యిహం
లేని వెక్కడనే ప్రశ్నన చేరును జీవనగమ్య పరం
కల్మషాన పునరపి జనన మరణాల నడుమ సంసార సాగరం
ప్రక్షాళనతో స్వశ్ఛత చేరువ జీవన గమ్యం – మోక్షహార్మ్యం
ఏకం, అద్వితీయం, అనాది, ఆదిభూతం
అచలం, నిర్మలం, నిశ్చలం, సాక్షీభూతం

నిరాకారం, నిర్గుణం, ప్రణవాకారం, గగన సదృశం
ఆదిమధ్యాంతర రహితమ్, సర్వనామ, సర్వరూప ధరం

సర్వశ్రేష్ఠం, సర్వజ్ఞం, విశ్వవ్యాప్తిం, సర్వశక్తిమాన్
మధురాతి మధురం – అమృతానంద నిలయం
గమ్యమే కాదు, కేవల ఆనంద భరితం
గమ్యం, ధ్యేయం, మార్గం, చలనం సర్వం అమితానందమయం
అమృతానంద నిలయం, అనంతానంద నిలయం, ప్రశాంతి మయం.

(26-4-14)

# 24. ప్రశాంతి

వర్ణనాతీతం ప్రశాంతి శాంతి
చూడనలవి కానిది ప్రశాంతి కాంతి
తనివి తీరనిది స్వామి ప్రేమానురక్తి
మరువలేనిది స్వామి స్పర్శానుభూతి

దర్శనమిచ్చె స్వామి ప్రత్యక్ష దైవమై
పాదస్పర్శతో  పావనంబాయె నా హృది
తపంబు మెచ్చెనని తెల్పె మృదుమధుర స్వరాన
పులకించెను మది ధన్యంబాయె జీవనంబని

నాదన్న దంతా నీదె స్వామీ!
నీ ప్రేమే నా శ్వాస, నా మనుగడ స్వామీ!
నేను కోరేది నీ ప్రేమే స్వామీ!
నీవే నా ఆరాధన, నీ ప్రేమలోనే నా జీవనం, జీవితం స్వామీ!.

# 25. శబ్దంలో నిశ్శబ్దం నీవు

శబ్దంలోని నిశ్శబ్దం నీవే – నిశ్శబ్దం లోని శబ్దం నీవే
ఏకం నీవే, అనేకం నీవే – ఏకానేకాల గమ్యం నీవే

ప్రణవం నీవే, సృష్టి నీవే – ప్రకృతి నీవే, ప్రళయం నీవే
చరం నీవే,  అచరం నీవే – చరాచర జగత్సర్వం నీవే
శూన్యం నీవే, పూర్ణం నీవే – కాలం నీవే, చక్రం నీవే

అండం నీవే, పిండం నీవే – అండపిండబ్రహ్మాండం నీవే
సూక్ష్మం నీవే, స్థూలం నీవే  సూక్ష్మ, స్థూల మనుగడ నీవే
ఆది నీవే, అంతం నీవే – ఆద్యంతముల మధ్యము నీవే

కార్యం నీవే, కర్తవు నీవే – కర్మం నీవే, ధర్మం నీవే
భోక్తవు నీవే, భోక్తం నీవే – భోజ్యం నీవే, భవ్యం నీవే
అన్నియు నీవే, అంతం నీవే – సర్వంలోని బ్రహ్మం నీవే

బ్రహ్మం కానిది ఏదీ లేదు – బ్రహ్మం కానిది లేనే లేదు
బ్రహ్మమే సర్వం, బ్రహ్మమయం సర్వం – సర్వం బ్రహ్మం
శబ్దం లోని నిశ్శబ్దం నీవే – నిశ్శబ్దంలోని శబ్దం నీవే.

# 26. హృదయ కురుక్షేత్రం

మన నిత్యజీవనమె ఒక కురుక్షేత్రం
మనోదేహ అరిషడ్వర్గాల కౌరవసేనకు
మనోబుద్ధి ఆత్మిక పంచపాండవసేనకు
మన హృదయ ధర్మక్షేత్రాన జరుగు నిత్య
అనునిత్య సంఘర్షణే మన జీవన కురుక్షేత్రం.

అన్నీ తెలిసియు, రాగద్వేషాల సంస్కారాల
బానిసయిన మనలోని భీష్మ, ద్రోణ, కర్ణులొక వైపు
ఆత్మధర్మాన పంచపాండవుల నొకటిగా నడిపించి
రాగద్వేషాల, అరిషడ్వర్గాలను త్రుంచి
మన వివేకమై విజయాన్ని చేకూర్చు పార్ధసారధొక వైపు
నూరు ఈర్ష్యా, ద్వేష, అహంకార, మద, మాత్సర్యములు
నిండు రారాజు బృందమొక వైపు
పాంచభౌతిక దేహమే రథమై, పంచేంద్రియాలు ఏకమై
అంతరాత్మ సారధై నడిపించు పంచపాండవు లొకవైపు

అంతరంగాన జరుగు అనునిత్య సంఘర్షణే మన హృదయ కురుక్షేత్రం
మంచికీ, చెడుకీ – సానుకూలతకూ, ప్రతికూలతకూ
ప్రియానికీ, మోదానికీ – తాత్కాలిక సుఖానికీ, దీర్ఘకాల క్షేమానికి
స్వార్థానికీ, త్యాగానికీ – ఐక్యతకూ విభజనకూ మధ్య జరుగు
నిత్య సంఘర్షణా కురుక్షేత్రం మన హదయ క్షేత్రం.

(జూలై 1, 2015)

# 27. యన్.టి.ఆర్.

(నందమూరి తారకరామువు)

యన్.టి.ఆర్. అనగ శతకోటి భావాల వెల్లువలు
ప్రవహించు నా మదిలో పలు మధుర స్మృతులు
తెలుగుకు, తెలుగు సత్తాకు నిలువెత్తు నిదర్శనం
ఆత్మీయత, ఆప్యాయత, ఆతిధ్యానికే మరో పేరైన వాడు.

విశ్వవిఖ్యాత నటసార్వభౌమా, అభినవ ఆంధ్రభోజా,
రూపసౌష్టవంలో మరచిపోలేని కలియుగ కృష్ణుడవు నీవు
వాగ్ధాటిలో అభినవ నరేంద్రుడవు నీవు
దేశభక్తిలో అభినవ సుభాష్ చంద్రుడవు
పదికోట్ల తెలుగుల ఆరాధ్య యుగపురుషుడవు నీవు
నీకు నీవే సాటి, వేరొకరు లేరు, న భూతో న భవిష్యత్

మరువలేమెన్నటికి నీ అమెరికా యాత్ర
మూడు దశాబ్దాల మధుర స్మృతులు
అది ప్రవాసాంధ్రులు మరువలేని రోజు
అదే అమెరికా తెలుగులకు మరపురాని రోజు

నందమూరి జాతి రత్నమా, ప్రవాసుల కంటి వెలుగా,
తెలుగు తల్లి మురిపాల గోపాలుడా, భారతరత్నమా,
స్వీకరించుమా మా ప్రవాసాంధ్రుల ప్రణమాంజలి
గ్రహించుమా రాఘవేంద్రుని అక్షర కృతజ్ఞతాంజలి.

(జూలై 5, 2015)

# 28. సర్వం బ్రహ్మం

మారే దానికి ఆధారం మారనిది – కదిలే దానికి ఆధారం కదలనిది
మారే జగతికి ఆధారం మారని దైవం – కదిలే దానికి ఆధారం కదలని సత్యం
సాకారానికి ఆధారం నిరాకారుడు – సగుణానికి ఆధారం నిర్గుణుడు
మాయకు ఆధారం మాయాతీతుడు – సుఖ, దుఃఖాలకు ఆధారం నిత్యానందుడు
కాలానికి ఆధారం కాలాతీతుడు – అంతానికి ఆధారుడు అనంతుడు
సృష్టికి ఆధారం సృష్టికర్త – ప్రకృతికి ఆధారం పరమేశ్వరుడు
ఎరుకకు ఆధారం ఎరిగించేవాడు – మరపుకు ఆధారం మరిపించేవాడు
చూపుకు ఆధారం చూచేవాడు – వినికిడికి ఆధారం వినేవాడు
స్పర్శకు ఆధారం స్పృశించే వాడు –రుచికి ఆధారం రుచి చూచేవాడు
అంధకారానికి ఆధారం వెలుగు – అధర్మానికి ఆధారం ధర్మము
అసత్యానికి ఆధారం సత్యము – ద్వేషానికి ఆధారం ప్రేమ
కామానికి ఆధారం నిష్కామం – క్రోధానికి ఆధారం కోరిక
లోభానికి ఆధారం ప్రలోభకారుడు – మోహానికి ఆధారం మురిపించే విష్ణువు
అహంకారానికి ఆధారం నిరహంకారం – అనాత్మకు ఆధారం ఆత్మయే
మేఘానికి ఆధారం సూర్యభగవానుడు – శూన్యానికి ఆధారం అనంతము

ద్వైతానికి మూలం అద్వైతం – ద్వైత, అద్వైతాలు ఏకాత్మని విభిన్నరూపాలు సృష్టి, సృష్టికర్త అభిన్నం, ఏకం. ఉన్నదొక్కటే, మంచిలోనే చెడు – చెడులోనే మంచి

ఏకాత్మభావనే విశ్వరూప దర్శనం, సర్వబ్రహ్మం

నింగీ బ్రహ్మమ్, నేలా బ్రహ్మమ్, నీరూ బ్రహ్మమ్, నిప్పూ బ్రహ్మమ్

తలపే బ్రహ్మమ్, తనువే బ్రహ్మమ్, కార్యం బ్రహ్మమ్, కర్తా బ్రహ్మమ్

సర్వం బ్రహ్మమ్, బ్రహ్మం సర్వం, సర్వమ్ బ్రహ్మమయమ్.

# 29. రాఘవేంద్ర ఏకాదశ యోగసూత్రాలు

| | | |
|---|---|---|
| 1. | నమ్మకం | కనిపించే కార్యం జగత్, కనిపించని కారణం బ్రహ్మం<br>కార్యకారణ సంబంధమే నమ్మకం<br>ఇదే జీవనహార్మ్యానికి మూలం, పునాది.<br>నమ్మకం లేని జీవితం తెగిన గాలిపటం |
| 2. | ఆత్మవిశ్వాసం | నేనొక్కడినేనని నా వల్లేమౌతుందని జంకకు<br>విశ్వంలో ఉన్నదే అణువణువులోనూ ఉన్నది.<br>సమస్త చరాచర జగత్తుతో నీకు బాంధవ్యం ఉంది.<br>విశ్వాణువుల శక్తి నీలోనూ ఉందని గట్టిగా నమ్ము.<br>ఇదే ఆత్మవిశ్వాసం, ఆత్మశక్తికిదే సోపానం. |
| 3. | గమ్యం | జీవనయాత్రకు కావలె ఒక గమ్యం<br>గమ్యం రహితజీవనం చుక్కాని లేని నావ<br>గమ్యం జీవితపు ధృవతారై<br>నడిపించును జీవనయాత్రను |
| 4. | మార్గం | గమ్యం ఒకటైనా మార్గాలు కోకొల్లలు<br>వక్రమార్గం, సక్రమమార్గం |

వక్రమార్గం అతిసులభమార్గం
సక్రమమార్గం మనకు మేలు మార్గం

5. ధ్యేయం — జీవనగమన సారం ధ్యేయం
ధ్యేయం గమనానికి ప్రాణం
కావలె ప్రతి జీవి జీవనానికి
ఓ ధ్యేయం. ఇదే జీవన ప్రాణం.

6. సాధన — సాధనశ్రమ ఒక యోగం
కృషితో నాస్తి దుర్భిక్షమ్
కృషితో మానవుడే మహాత్ముడవుతాడు
నిస్వార్ధకర్మయే స్వచ్ఛతకు నాంది.

7. తితీక్ష — సాధనను తపస్సుగా మార్చే శక్తి అతీక్ష
నిర్విరామ, నిరంతర శ్రమయే తితీక్ష
నీట మునుగు వాడు శ్వాసకోరినట్లు
కావలె మన తితీక్ష శ్రమకు ఆజ్యంలా.

8. స్వీకారం — జీవనసమరం అవుతుందొక జీవన క్రీడ
అంగీకారం అనే ఒక స్వీకారంతో
శ్రమను యోగంగా మార్చే సాధనం
స్వీకారం యిదే ఒక యోగాంశం

9. సమతుల్యత — సమత్వం, సమతుల్యం ఇదే బుద్ధుని మధ్యేమార్గం
ఇదే గీతాచార్యుని స్థితప్రజ్ఞత్వ లక్షణం
గెలుపు ఓటములు ఒక్క చందం
సమత్వ లక్షణం సమతుల్యత కిదే ప్రమాణం.

10. ఆనందానుభవం నిన్న ఒక చరిత్రాంశం, రేపు అగమ్యగోచరం
నేడే మనది, ఆనందంగా అనుభవించు
ప్రతి క్షణం ఆస్వాదించు ఆనందాన్ని
ఇదే ఆనందానికి అసలు సిసలు సూత్రం

11. కృతజ్ఞత పూర్ణం, పరిపూర్ణం వ్యక్తీకరణం కృతజ్ఞత
పెల్లుబికే పరిపూర్ణతే కృతజ్ఞత
సర్వవేద సారం కృతజ్ఞత
మనిషికి, మనసుకు అందం కృతజ్ఞతా భావం.

(అక్టోబరు 23, 2014)

# 30. ప్రేమ స్వరూపం

సత్యం సర్వ వ్యాప్తం, సర్వజ్ఞం, సర్వశక్తి మయం
నిరాకారం, నిర్గుణం, సాక్షీభూతం, నిశ్చలం.

నిశ్చల సత్య భావప్రవాహ బాహ్యీకరణం ప్రేమ
సత్యబాహ్య ప్రవాహం ప్రేమ
నిశ్చల సత్య బాహ్య వ్యక్తీకరణం ప్రేమ.

త్రికాలవేద్యం సత్యం
సర్వకాల, సర్వావస్తలలో నిత్యం
ఉన్నది, ఉంటున్నది, ఉండబోయేది సత్యం
సత్యభావనమే ప్రేమ
సత్యభావనా తరంగం ప్రేమ
సత్యభావనా ప్రవాహమే ప్రేమ
సత్యం ద్రవించి ప్రవహించితే ప్రేమ

సత్యానుభవం శాంతి
సత్యాన్ని అనుభవించితే శాంతి.

సత్యావగాహనమే అహింస
అర్థం గ్రహించితే అహింస.

సత్యాచరణం ధర్మం
సత్య కర్మం ధర్మం

(జూన్ 26, 2018)

# 31. విషప్రక్షాళనామృతం

క్షీరసాగరమధన ధ్యేయం అమృతం
మున్ముందు వచ్చినది హాలాహలం
ప్రక్షాళనే ప్రధమ కర్తవ్యమని దీని ఆంతర్యం
వెలుగు రావాలనిన, చీకటి పోవాలనే భావం
విద్యరావాలనిన  అవిద్యపోవాలని భావం
స్వశ్ఛత రావాలనిన కల్మష ప్రక్షాళన జరగాలనే ఆంతర్యం

అజ్ఞాన నిర్మూలనం జ్ఞానోదయమే
చీకటినిర్మూలన సూర్యోదయమే
విష ప్రక్షాళనం అమృతసిద్ధియే

దేహారోగ్యంలో దేహకలుషిత ప్రక్షాళన ప్రధమ కర్తవ్యం
విష విసర్జన రహిత అమృతపానం నిరర్థకం
దానవత్వ నిర్మూలన మానవత్వ శుభోదయం
అజ్ఞానాన్ని వీడితే విజ్ఞానులమౌతాం
మరపును వీడితే ఎరుకన స్వస్వరూప దర్శనమౌనుకదా

(ఫిబ్రవరి 9, 2019)

# 32. LOVE AND SELF

Love is Selflessness
Self is Lovelessness

Faith is Fearlessness
Fear is Faithlessness

Compassion is Hatred free
Hatred is Compassion free

Gratitude is Fullness
Revenge is Incompleteness

Sacrifice is Expansion
Ego is Contraction
Forgiving is Cleansing
Holding Grudge is Garbage Filling

(7/18/2014)

# 33. సాయి నామమె అతి మధురం

సాయి నామమె అతి మధురం / సాయి రూపమె అతి మధురం X 2
సాయి తలపే అతి మధురం / సాయి చింతనె అతి మధురం X 2
సాయి ప్రేమే అతి మధురం / సాయి జీవనమె అతి మధురం X 2
సాయి పలుకే అతి మధురం / సాయి ధ్యానమే అతి మధురం X 2
మధురం మధురం అతి మధురం / మధువును మించిన మాధుర్యం X 2

★★★

LEADER – OTHERS LEADER – OTHERS
సాయి నామమె అతి మధురం / సాయి రూపమె అతి మధురం
సాయి తలపె అతి మధురం / సాయి చింతనె అతి మధురం
సాయి ప్రేమే అతి మధురం / సాయి జీవనమె అతి మధురం
సాయి పలుకే అతి మధురం / సాయి ధ్యానమే అతి మధురం
మధురం మధురం అతి మధురం / మధువును మించిన మాధుర్యం
మధురం మధురం – సాయి నామమె మధురం మధురం – సాయి నామమె
సాయి నామమె మాధుర్యం ALL3 LINES This Triplet X 5

★★★

Triplet in Chorus : మధురం మధురం సాయి నామమె
మధురం మధురం సాయి నామమె సాయి నామమె మాధుర్యం
ALL 3 LINES X 4

★★★

మధురం మధురం అతి మధురం – సాయి నామమే మాధుర్యం

Slow Closing 11/19/2017

# 34. నా సాయి భజన్

సత్యం సాయి – ధర్మం సాయి : సత్యధర్మ, స్వరూపం సాయీ ॥ సత్యం ॥
శాంతియె సాయి–అహింసయె సాయి: శాంతి అహింసల, స్వరూపం సాయీ ॥ సత్యం॥
ప్రేమయె సాయి–త్యాగమె సాయీ: త్యాగప్రేమల స్వరూపం సాయీ॥ సత్యం॥
ఏకం సాయి – అనేకం సాయీ: ఏకానేక, స్వరూపం సాయీ ॥ సత్యం ॥
నిత్యం సాయి – అనిత్యం సాయీ: నిత్యానిత్య, స్వరూపం సాయీ ॥ సత్యం॥
త్రిగుణం సాయి – నిర్గుణం సాయి: సర్వగుణాతీతం సాయీ ॥ సత్యం ॥
జగ్ మే సాయి – దిల్ మే సాయి: సాయి మయం, సబ్ కుచ్ మే సాయీ ॥ సత్యం॥
సాయి బినా– యీ విశ్వం శూన్యం: సాయి ప్రేమ్ భరో –పూర్ణకరో జీవన్ ॥ సత్యం॥
సాయిరాం – సాయిరాం – సాయీసాయీరాం X 2
సాయిరాం – సాయిరాం – సాయీసాయీరాం X 2 (బృందగానం)
సాయీ (ఆలాపన మొదలు )
సాయిరాం – సాయిరాం – సాయీసాయీరాం X 4
(ఆలాపన ముగింపు)
సత్యం సాయి – ధర్మం సాయి (ముగింపు)
సత్యధర్మ స్వరూపం సాయీ

అక్టోబర్ 23, 201

# 35. గోవింద గోవింద యని పలకరా

గోవింద గోవింద యని పలకరా
మది గోవింద పాదాల కడ నుంచరా ॥ గోవింద ॥

కింకరుడుగా నీవు సేవించరా
శంకరుడుగానే నువు మారరా ॥ గోవింద ॥

నవరంధ్రాల వేణువుగ నువు మారరా
మధుర వేణునాదమె నీ ప్రాణమౌనురా ॥ గోవింద ॥

తలపులన్నీ వదలి శూన్య మౌదువురా
అనంత విశ్వమే నీ దేహ మౌనురా ॥ గోవింద ॥

అది నీవేననే తలపు మదినింపరా
అన్నీ అదే ఇదిగ సర్వం బ్రహ్మ మౌనురా ॥ గోవింద ॥

(అక్టోబర్ 20, 2014)

# 36. అంతట నిండిన నా శ్రీరాముడు

అంతట నిండిన నా శ్రీరాముడు యిక్కడనున్నాడు
నివాసిగనున్నాడు, హృదయ వాసిగనున్నాడు ॥ అంతట ॥

బయటా లోపలనున్న రాముడు
కణాన ఉన్నాడూ, కణ, కణాన నున్నాడూ ॥ అంతట ॥

తలపూ, కార్యం, కర్తా రాముడు
భోక్తగనున్నాడూ, అనుభూతిగనున్నాడు ॥ అంతట ॥

నటనా, కథనం, దర్శకరాముడు
ప్రేక్షకుడైనాడు, సాక్షీప్రేక్షకుడైనాడు ॥ అంతట ॥

నాడూ, నేడూ, రేపై రాముడు
అతీతునిగ ఉన్నాడు, కాలతీతునిగ ఉన్నాడు ॥ అంతట ॥

దేహం, దేహి, దైవం రాముడు
సాక్షిగనున్నాడు, సాక్షీభూతిగ నున్నాడు ॥ అంతట ॥

(అక్టోబర్ 15, 2014)

# 37. నా వానప్రస్థం

నిదురొచ్చినంతనే నిదుర, రాకుంటే మేధామధనం
చేయాలనిపించితేనే శ్రమ, అలసట కలిగినంతనే విశ్రామం
తిరగాలని ఉంటే విహారం, ధారణలోనే రచనం
రేపిక రాదేమో అన్నటుల, నిరంతర ఆధ్యాత్మిక శోధనం

గత జ్ఞాపకాలు శూన్యం, భవిష్యత్ భయాలు కడు దూరం
ప్రతిఫలాపేక్ష రహితం, నిష్కామ కర్మ, సేవనం
కపటం లేని నిస్వార్ధం, వెన్న వంటి హృదయం, వెన్నెల వంటి మనస్సు
తేనె వంటి పలుకుల బాల్యపు ప్రాయ పునఃదర్శనం.

బాధ్యతా శూన్య పౌత్రానంద ఆస్వాదామృతం
కర్తవ్యరహిత ప్రేమ, నిస్వార్ధ సేవనం, అనంతానందం
ఆత్మానందశోధనం, ఏకాత్మభావనం, పరిపూర్ణతా ప్రకాశం
ఆటంకరహిత ఆత్మభాను కిరణ అనంతప్రకాశం
దైవం చిత్రించిన రంగుల హరివిల్లులో యీ ప్రపంచం
దైవలీలా నాటకం, అత్యద్భుతం యీ జీవనం.
దేహం క్షీణిస్తున్నా, కదలికల వేగం తగ్గినా
చేతులు వణికినా, మాటలదరినా,

జ్ఞాపకాలు సన్నగిల్లినా, దేహశక్తులు తగ్గినా
ఇంద్రియపటుత్వం సడలినా, సమాజం నిర్లక్ష్యించినా
ఇవి నాకు బంగారు క్షణాలు, నా బంగారు క్షణాలు.

మనసు నిర్మలమై, దైవంలో నిలచి ఉన్నది కాన
స్వశ్ఛమై, స్థిరమై ప్రపంచం నాకు దర్శన మౌతున్నది కాన
ప్రపంచమంతా సాలెగూడు చందమున కలసి బంధములతో
ఒకటై, ఏకమై కనుపించే ఇవి నాకు మధురక్షణాలు.కావున

బాహ్యంలో లేదు, లేదు ఏ మార్పు
అంతరంగంలోనే తిరుగులేని యీ పరిణామం
యిదే నా పండరీపురం, పాండురంగ నిలయం
కర్మబంధపు మూటలు మటుమాయం
గత స్మృతుల భారం నిష్క్రమణం.

సర్వం బంధుమయం, అజాత శతృత్వం
ప్రపంచం మంచితనపు ప్రతిరూపం, దైవమయం
విశ్వకుటుంబ దర్శనం, విశ్వబాంధవ్యం

వానప్రస్థమా మధురం నీ రూపం, వర్ణనాతీతం.
భాషకందనిది, వర్ణించలేనిది, నీ రూపం
ఆత్మదర్శనముననే కలుగు నీ అవగాహనం
వానప్రస్థ దృశ్యం అతి మధురం
పూర్ణతా, స్వేశ్ఛల గమ్యం
వానప్రస్థమా నా నేస్తమా,
అనంతానందంతోఆహ్వానిస్తున్నాను నిన్ను.

(జూన్ 16, 2015)



# 38. భవాని స్తుతి

తెలవారెను మలి సంధ్యన
పక్షుల కిలకిలారావములతో
మేల్కొంటిని అమ్మ ప్రకృతి ఒడిన
తెరచితి కనులను ప్రకృతి ప్రకాశమున
నిలచితి భూమాత ఆధారమున నేను తన ఓర్పున
భాగీరధీ జలధారాప్రవాహమున సేదదీరితి.
గంగాపానమున ఆర్తినార్చి, మాతా అన్నపూర్ణేశ్వరీ కృపన్
వైశ్యానరున్ నే శాంతింపజేసితి.

వాగ్దేవి నా హృదయమున కదలి, పలుకునన్ వెడలి
సర్వేశ్వర స్తుతిన్ శాంతించెన్ మది
వెడలెను ఈ జీవి దేహమనోధర్మముల్ సలుప బాహ్యమున
అంతర్ నవశక్తి, అష్ట ఐశ్వర్య లక్ష్మీప్రసాద సిద్ధిన
అరిషడ్వర్గములన్ ప్రక్షాళింపగ దుర్గామాతా కృపన్
అసుర పశు సంస్కారము నిర్జింప మొదలిడితి.
అమృతత్వమున్ నే కోరితి, విషయ విషమున్
నే అర్పించితి అంతర గరళకంఠునికిన్



అజ్ఞానాంధకారమును నే త్రుంచి శ్రీగాయత్రీ కటాక్ష
సిద్ధిన జ్ఞానదీపికా వెలుగులు నలుదిశల ప్రసరించగన్
విజ్ఞానము ప్రజ్ఞానంబాయె మాతా భవానీ సందర్శన భాగ్యాన
విశ్వదర్శనంబాయె, యధాతద్రూపమున
ప్రత్యక్షానుభవమున ధన్యమయ్యె నా జన్మంబు,
శేషజీవితమున్ నే గడిపెద నీ చిద్రూప జగత్తున,
సంఘమే నీ రూపమై నిలచినది కావున.

చేయను నే పూజలు, ఎరుగను నేను ఏ ధ్యానము, మంత్రసంస్కారముల్
తెలియు నొక్కటే నీ సేవ, సేవయే సర్వము తదితరమెరుంగను.
నిత్యము నీ సేవనమునన్, సదా నే వీక్షించెద నీ రూపమున్
సర్వమూ నీవె అయినందునన్ నే వీక్షించెదన్ సదా నిను
యద్భావంబు తత్ భవతి 'మాతా భవానీ నమోస్తుతే, ప్రణమోస్తుతే.'

(డిసెంబర్ 16, 2016)